రాజేశ్వరీ ప్రచురణం

# పేమవీధి

౧౯౪౭

రచయిత:

శ్రీ అయ్యగారి విశ్వేశ్వరరావుగారు

# వినతి

అఖండ కావ్య సందోహము సహృదయులకు ఆమోదము కలిగిస్తుందనే కాంక్షతో 'వినువీధి' రచయితలకు కృతజ్ఞతాపూర్వక వందనాలు అందచేస్తూ కావ్యంలోని అందచందాలు చదివితే గ్రహించవలసిందని మనవి చేస్తున్నాము.

ఇలాంటి కావ్యావళినే ముద్రించి విరళంగా ప్రకటించి ఆంధ్రావనికి మోదము కలుగచేయాలని మా సంకల్పం. మా సంకల్పానికి బలం పాఠకలోకం. ఈ రచనాశిల్పము మా జనని, స్వర్గలోకవాసిని శ్రీకాళహస్తి పాపాయమ్మగారికి కవిసుమాలు అంకితం చేసినారు. కవిగారికి మా వినతి.

ప్రకాశకులు

రాజమహేంద్రవరం

# మనవిమాటలు

వినోదప్రాయంగా రచన సాగించిన నాకలా ప్రథమ ప్రయత్నఫలితంగా రసికాంధ్రలోకానికి సమర్పించిన కావ్యమే సుమమే యీ విరిసీధి!

కావ్యనిర్మాణానికీ కవితాశిల్పానికీ యీ శతకం యెంతటి బాంధవ్యాన్ని కల్పించుకొన్నదనే ప్రశ్నా తత్సమాధానం ఆంధ్ర పాఠకలోకానిదే!

రచనావిధానంలో అమూల్యసహకారం చూపించిన మిత్రులు చాలామంది వున్నారు. వారందరికీ వ్యక్తిగతంగా అభినందనాలను సమర్పించలేనందుకు నా క్షమార్పణ. యీ సమయంలో వారిని స్మరించి కృతజ్ఞత చూపించుకుంటున్నాను

పుస్తకాన్ని సర్వాంగసుందరంగా ముద్రించిన శ్రీ కాళహస్తి తమ్మారావు అండ్ సన్సువారి సారస్వతసేవ తెలుగుదేశానికి తెలియనిదికాదు. వారికి నా శుభాకాంక్షలు

ఇట్లు,

మీ విశ్వేశ్వరరావు

రచయిత

ఆంధ్ర కవితాకుమారి

గృహలక్ష్మి

ప్రతీతి

యుద్ధభూతము

కోకిల

వీరమాత

నేఁడు

శ్రావణము

ఆగస్త్యుఁడు

సుషమ

ఆంధ్ర భారతి

మాళవ్యాజీ

గౌతమి

# స్మృతి

జనియించినది పూర్వజన్మ పుణ్యంబుగా
వనితలమిన్నయై భరతభూమి
మురిపించినది మెంతో ముద్దులబిడ్డగా
మహితుడా పాపయ్య మందిరాన
సాగించినది మహాసాధ్వీలలామయై
'కాళహస్తి' గృహాన కాపురంబు
కనిపెంచినది కడు గణ్యాత్ములైనట్టి
నేరెన్నకన్ గన్న ప్రియసుతాళి

పాపయమ్మ యనగ పరువును గడియించె
తమ్మయార్యకీమె ధర్మనిష్ఠ
ఆ సుమంగళికిక యాత్మ శాంతించగా
వేడ్క నిచ్చెద 'వినువీథి' కృతిని!

# మాతృపూజ

మౌర్యనృపాలుర వీర్యశౌర్యాలకుఁ
శ్రద్ధగా గర్వించు ముద్దరాలు!
తెలుఁగురాజులకీర్తి తలుచుకొన్నప్పుడు
కడుముదం బందెడి కన్నతల్లి!

బుద్ధదేవుని పుణ్యాబోధనల న్వీని
మురుపు జూపించెడి పూర్వచరిత
ఆ శివాజీ సల్పు సాహసోద్దండత
కిచ్చెఱువందడి యార్యవినుత.

శూరవరులను గన్నదీ వీరవనిత
రత్నగర్భ యనంగను రాణకెక్కె
కాలపురుషుని గారడీ ఘనతకతన
పట్టినిరుపేదయైన దీ భరతమాత!

పెంచుకొన్నది ఎంత ప్రేమాతిశయరీతి
విజయలక్ష్మిని దెచ్చు వీరవరుల
చూచుకొన్నది తనశోభను దిద్దిన
కవికుమార రచిత కావ్యవితతి

దాచుకొన్నద వెన్నో తన ఖజానాలోన
ధనధాన్యములను రత్నాలసరుల
నింపుకొన్నది మది నిస్తులానందంబు
గాయకు కమ్మని కంఠమునకు

విశ్వవిఖ్యాతచరిత యగు వీరమాత
మహిత గుణజాత బహుళసంపత్సమేత
పెంచి పెద్దగ జేసి దీవించె నన్ను
చెప్పుకొందును నా జాతి గొప్పదనము

సత్యాగ్రహంబును స్థాపించు మా గాంధి
బోసినోటిని జూచి మురియు నెప్పుడు
పండిత జవహరు వాక్యాలధాటికి
నమితమోదంబంది యలరు నెప్పుడు
రాజేంద్రబాబు విరాజిత సేవకు
ముదమందుచుండు నెమ్మదిని నెప్పుడు
సమతాభిమానియై స్వార్థమరయని మా
బోసునుగాంచి యుప్పొంగు నెప్పుడు

హిందుముస్లిము సఖ్యత యేర్పడంగ
జూచుభాగ్యమే లేదని స్రుక్కు నెప్పుడు!
దాస్యబంధాలతోడ వితాకునందు
భరత జననయిత్రి! సర్వసంపదలధాత్రి!

# ఆకలిమంట

చినిఁగిన పాతదుస్తులను సిగ్గునువిడి ధరించినాడు, ఆ
కని గరమంటుచున్న దాఁక తాతలనాటిది పాతగిన్నె-యే
మఁటమొక, వాని దీనతకు నాదరభావము గానరాదు, జీ
వనము వితాకులో మునిఁగె, వానినరించె క్షుధార్తి ప్రేమతో!

వట్టి యెముకలగూటిలో పుట్టుచుండె
మధురమంజుల గీతాల విధమదంత!
ఓర్చుకోలేని బాధతో మర్మాలోన
ప్రేమ సందడంగ వెడలెనా బిచ్చగాఁడు.

ఆతని గీతికారవము లద్భుతభావ సముద్భవమ్ములై
ప్రతినిగూర్చె నెల్లఆకు, బిచ్చమువేయుట మానుచింకెవో
గూతలఁగూయ జొచ్చిరఁట గొంటెతనాన బ్రజాళి-వానికే
కీతి లభించునన్నయిక, రిక్తఁగ నేగతిసల్పు భూమిపై!

వీధికుక్కలు మొఱుఁగుచు వెంటవచ్చె
నడువ కాళ్ళాడనయ్యె ననాథుఁడతఁడు
బ్రతుకుతెలియఁక వానికి భారమయ్యె
నిలిచియున్నాఁడు మృత్యువునీడలందు!

ఆతని మానసవ్యథల నారయు వాఁడొకఁడైన లేఁడు! యే
మోతలపోసి వానినొక మోఁటకురీతిఁ దలంచు చెన్నియో
రీతుల దూరినారు, విపరీత పరిస్థితి బిచ్చగానికై
కోతలఁగూర్చె నీఁడలును గూరిమిగోరెను నేలగూల్పఁగన్.

నిలువఁగ నీడ లేదతని నిర్మలభావము మాయమయ్యెనా
కలవరపాట్లు నెయ్యముఁ గాంచెను భిక్షుకు—నాశలన్నినో
గలుఁగవు, మండుటెండలకు గాలికి వానకు రక్షలేనియే
నిలుచు వృథాగదా బ్రతుకు నీరజగర్భుని సృష్టిలోపలన్.

పత్రికలలోన విఖ్యాతి వఱలుగాని
దానధర్మాల మాటలే దఱికిరావు!
కడుపుమంటను చల్లార్చు ఘనులు లేరు
మాయదారుల మయమునా మాయజగతి!

జేనెఁడుపొట్ట నింపికొన చింతలఁగొఁబడి మ్రాల్చుచుండె, నీ
మానవజాతిలోన నిఁక మచ్చునకైన యుదారభావమే
గానఁగరాదటంచుఁ గడుగాసిలె నాతఁడు బెక్కు—మార్లు—నా
మానసమెల్ల చిల్లవడె మాయప్రపంచపురీతి చూడఁగన్.

బలికి దానంబునేర్పిన భాగ్యభూమి!
దానకర్ణునిఁ బెంచిన ధర్మభూమి!
పరమపావనమైనదీ భరతభూమి
పెంచుకొనుచుండె నయ్యయో! బిచ్చగాండ్ర!

# శాంతి దూత

విశ్వభారతి నీకు దీవెనల నిడఁగ
విజయలక్ష్మియె కపురంపు వెలుఁగుఁ జూప
మా సరోజిని పాడంగ మంగళంబు
గాంధి - నవయుగ సంఘ - దీర్ఘాయువగుత !

చెఱసాల నేలకు జీవిత సౌఖ్యము
ధారవోసినయట్టి త్యాగమూర్తి
భారతజాతీయ భాగ్యాభిలాషివై
ఉపవాసములఁ జేయు నుత్తముండు
జాతి భేదము లేక సమతాభిమానివై
ప్రఖ్యాతి గొన్నట్టి పండితుండు
ప్రేమస్వభావపుఁ బెత్తనదారుఁడై
ఘుల జేసి కీర్తిఁబొందఁ గులుకుసామి

భారతావని [illegible]తఁను భాగ్యరాశి
మకుట మొక్కటి లేనట్టి మనుజవిభుఁడు
కనఁ డిఁ కేనాటికైనను గర్వసరణి
ఆర్యసన్నుతినందు మహాత్మగాంధి!

ఈ బక్క పేగులింకే యాశయాలకు
నెలవులై యున్నవో తలపలేను
ఈ ముదుసలి దేహ మెన్ని కష్టాలలో
మునిగెనో రవ్వంత గనఁగలేను
ఈ ముసిముసినవ్వు లెన్ని దేశాలలో
ఘనత నార్జించెనో కాంచలేను
ఈ కార్యదీక్షకు నెట్టిమహాత్ములు
చెలిమి వాంఛించిరో తెలియలేను

సత్యసంతోషి – రాట్నంపు నేస్తగాఁడు
కదురుసఖ్యానఁ బ్రమదంబు గాంచుచున్నాఁడు
భరతజనయిత్రి కనకగర్భానఁ బుట్టి
జన్మసార్థక మొనరించె శాంతిమాత !

ఖడ్గగునస్త్రాల ఘనతను జాటుచు
నూలు వడుక నేర్పు సాలివాఁడు
హింసాపథంబును హితవుగాఁ గననట్టి
బుద్ధదేవునివంటి పూజ్యుఁడితఁడు
హరిజనవీరుల ననురాగ మొలుకంగ
గుండెలకంపిన జాలిగుండెవాఁడు
హాలిక దుస్థితి కనుకంప వహియించి
ప్రియభాషణము సల్పు ప్రేమమయుఁడు

మాటలాడిన రతనాలు మూటగట్టు
బోసినోటను దలచిన బంగారాలు
నతని వాక్యాల వర్షించు నమృతధార
దిట్టయా గాంధి! శోభనా! దేవుడతడు!

యువకరక్తంబును నుప్పొంగఁ జేసెఁ
రాజకీయము నేర్పు రాచబిడ్డ
సత్యప్రవర్తన జనదాస్యసంకెల
దీక్ష వహించిన దివ్యమూర్తి
యుద్ధపైశాచిక హుంకారముల కెల్ల
శాంతిమంత్రము జెప్పు శాస్త్రవేత్త
ఆడంబరము లేని ఆదర్శపురుషుండై
ప్రజల మెప్పులఁ గొన్న భాగ్యశాలి

వింతయేకద చూడఁగా బిలకసామి
యెచట దాచినాఁడో కాని యింత ప్రతిభ
నెల్లదేశాలు నెలుఁగెత్తి యితని బొగడ
మూటగట్టెను యశము నీ ముసలితాత!

# ప్రావృట్కాలము

సెలయేరు జలమును జేర్చ్వాఁడనటంచుఁ
గానరాగాలతోఁ గులుకుచుండ
కొనయూపిరిన్ దాల్చి గోడాందు తృణములు
వచ్చుచున్నావంచుఁ బ్రమదమంద
నీలిమబ్బులు నీదు నెయ్యమ్ము నాశించి
వింతగా నింగిపై గంతులిడఁగ
పిల్లగాలులుగూడి ప్రేమమీరఁగ నీకు
నతులితరీతి జోహారు లొసఁగ

విజయఘోషల నురుములు వెడలుచుండ
మెఱయు కిన్నెరకాంతతో మేలమాడ
రాచతీవిని ప్రకృతి పరాసరికిని
వర్షకాలమ – వచ్చితే హర్షమెలయ.

పాయని మండు టెండలకు బానిసయైన వసుంధరాసతిన్
ఆయువునిచ్చి కాచితివి, హర్షముగూర్చితి వర్షధారతో
సాయము లేక జీర్ణమయి చచ్చినయట్టివి గడ్డిపోచలన్
నీ యభిమానమెందులకొ నిల్వఁగఁ జేసితి నూత్నశోభతో.

అందమునందు మేటినని హాయిగఁ దాగలసఖ్య మందుచున్
విందుల స్వీకరించుచును ప్రేమపిపాసిగ చంద్రుఁడుండ నీ
వెందుల కట్టిసాన్నిధ్యమును వేటినిఁగల్పితి - నీలిమబ్బులే
వందురఁ జేసె నాళినిని-పాపముసుమ్మిది వర్షకాలమా!

మర్మము లేని జీవనము మాదసి శోధనఁ జేయునట్టి మా
కార్మిక కర్షకావళినిఁ గాచెదు దాతలు లేనినాఁడు-నీ
ధార్మిక మేడ నేర్చితివో తంత్రి విధాన జలంబులిచ్చితే!
నిర్మలమైన నీ మనసునేర్పడె వాఁము ఆంధ్ర జాతికిన్.

ఆఁకటిచిచ్చులో వెతలనందు నభాగ్యులు బిచ్చగాండ్రు యే
వాఁకిటికేగ లేక, జడివానలలోఁబడి దిక్కులేక నీ
తాకకు దాసులై యుచటడస్సిరి - కాంచితె వర్షకాలమా!
ఈ కలికాలమందు లభియింపదు ధర్మము మచ్చుకేనియున్.

గాన విశారదుండనని గర్వమునందుచు మన్ను మిన్నులన్
గానక యెక్కపెట్టుగను కంఠమునెత్తుచు బాడుకోయిలన్
యేనసియేటిలో మునిచితెంతటి ఘోరము వర్షకాలమా
వానలహోరు లెక్కనిఁక వాంఛితమెద్దియు నీకు లేదొకో!

పిడుగుల నేస్త్రకాండ్రనుచుఁ ప్రేమధనాన్వితులంచు వారితో
తడబడకుండ నేగెదవు, ధాత్రియె వారలదూరుచుండు, నే
యిడుముల నందెదో తెలియ దింత యమాయకుఁడైనవానికా
పడతి మెఱుంగు తీగ సమభాగిని యాట విచిత్రమాగదా!

# హంపీ క్షేత్రము

కాలి గజ్జెలు నందియుల్ ఘుగ్గుమనఁగ
హంపియందున విహరించె నాంధ్రలక్ష్మి
దానిఫలితమా? క్షేత్రాల తాండవమ్ము
ఆంధ్ర వీరుల మగతనం బంతరించె—

ఒకనాఁడు కవిరాజు లూరేఁగఁ బెప్పిరిత్రి
నాంధ్ర భూమికిఁ దెచ్చె హంపి యిద్ది
ఒకనాఁడు దేశాల నోడించి గీర్వాణ
మాంధ్ర భూమికి నిచ్చె హంపి యిద్ది
ఒకనాఁడు తెలుఁగుల యుజ్వలశౌర్యాన
నాంధ్ర భూమిఁ గులుకు హంపి యిద్ది.
ఒకనాఁడు శోభతో సకలసంపదలెన్నొ
ఆంధ్ర భూమిన్ బెంచు హంపియిద్ది

ఇంత వైభవోపేతమా ప్రాంతమందు
గబ్బిలంబులు వసియించు కాల మిద్ది!
చనిన దానాఁడె తెలుఁగుల స్వర్ణయుగము
చితికినత్తురు జేరెనా వీరహృదిని!

క్షేమాత మాతృల తేజవంతంబైన
గగనంపుగాథలు చరితలందె
బాహుబలస్ఫూర్తి పటుశౌర్యమున నాజి
శత్రులం జంపుట చరితలందె
కవితా వినోదులై క్రాలిన రాజుల
మురిపెంపు వార్తలు చరితలందె
ఆంధ్ర రాష్ట్రవ్యాప్తి యసమాన మనురీతి
సమ్మదం బొందుట చరితలందె

వినుమమ్మ పారతంత్ర్యమునకటా విధికల్పించె
పౌరుషంబులు విడనాడు పందలైరి—
కడుపునిండిన సంతసం పడెడి జనుల
కట్టి బాహుబలంబేది? ఆంధ్రభూమి!

కవిసార్వభౌముల కావ్యగానంబులు
కర్ణపేశలమౌచు గ్రాలె నెచట
గాయకరత్నాల గాన వాహినులెన్నొ
ప్రవహించె నెచ్చోట ప్రకృతగతిని
వేదవేదాంగాది విద్యావినోదమ్ము
ఘోషించె నే వీట గులుకు లొలుక
కత్తిసాములనేర్చి కడుపు పంటగ గ్రాలు
వీరాధివీరులు వెలసి రెచట

అట్టి బంగరుగిన్నెయందు హొంసెయుందు
దీప్తమైనను బెట్టినీ దిక్కు లేదు
పుట్టుగానిసవా తెల్గుపుత్రులకును
చూపు నీ హాంపి ఆంధ్రుల శోభబాడ!

ప్రౌఢ విద్యారణ్య శ్రుతిమూర్తి వాక్కున
పుట్టిన మేటిదా పుణ్యభూమి
రాయల శౌర్యాన రగడ దేరినయట్లు
సద్యశం బందిన స్వర్ణభూమి
తిమ్మన్న కైతలో తీయని ఘట్టాల
నధిక మోదంబొందు ప్రథితభూమి
పెద్దన్న కవనంపు బెనుతీవి యల్లాడ
ప్రమోదంబునందిన భాగ్యభూమి

అకట! హీనమౌ దారిద్ర్య మావహించె
వన్యమృగముల కారులా ఫలములయ్యె
మచ్చు కొక్కడైన మనుజుండు మసలడిప్పుడు
బూదికలసెను తెల్గు జవాది యెల్ల!

తెలుగు వెలుంగుమాసె, ఘనతేజమె ఆంధ్రులటన్నరోసె, నా
సలలిత కీర్తికాంత మనసార వశించె విదేశవీరులన్
విలసనమాంధ్రలక్ష్మి యిట వేసరిపోయె బికారిపోలికన్
కులుకుదనమ్మె యాంధ్రులకు గూడనిదాయె నిదేటి-చోద్యమా!

హంపి దిలకించి నగవని యాంధ్రుఁడేని
దాని ఔన్నత్యగరిమ విన్న దాసుఁడైన
తెలుఁగు బిడ్డఁడు కాఁడోయి! తెలుఁగులార!
యనుచు గర్జించు పినవీధి నాహవోత్సాహియగుచు

ఎవని కన్నుల్వర్షియెనో యెఱుఁగలేము
మఱినాఁయ తుంగగణంబులు మట్టిఁగలిసె
నాంధ్ర! నీవెంత నిర్భాగ్యురాలవమ్మ
దాసివైనావు కష్టాల దోసిలొగ్గి.

హంపి శిథిలాల గనుఁడోయి ఆంధ్రులార!
తెనుఁగువీర నగారాలు దిబ్బకేఁగె
నారసింహ కీర్తికయుండు నిపుడు
గూయుచున్నది సరదాగ గుడ్లగూబ!

తెలుఁగువీరు గుడారముల్ వెలయునిచట
గాంత్రమనుచుండె క్రూరమృగాలవెన్నొ
యింక లేదోయి ఆంధ్రుఁడా! యింతశోభ
యీఁదులాఁడర కన్నీటి యేటిలోన!

# తీతువు

ఏటికిఁ దీతువా యటంచు దీగతి సొమ్ములు పోయినట్లుగాఁ
గాటికి రాఁగదోయి! యని గానము చేసెదు సిగ్గుమాలి, నీ
పాటలు పాడుగాను! భువి పచ్చగనుండినఁ గన్నుకుట్టునా?
చేటులతోడ మానవులు చింతిల భాగ్యమె నీకుఁ దీతువా!

పిల్లలఁ బెద్దలందఱిని భీతిలఁజేసెదు నీదుకూఁత లీ
యుల్లరిఁ గాంచి వంగటనె యబ్బురమందితివోయి వింటివా:
ముల్లులు నీదుమాటలంట, ముప్పులకెంతయు బాటలంట, నీ
యిల్లు బజారుపాలయెను; యెందుల కీయపకీర్తి తీతువా!

కాలునిమాత తీతు వను కల్లరిమాటలు నింక నేఁడు, నీ
కేలన నోళ్లలో నసుట–యెల్లరు దుమ్మును నెత్తిపోయుటే
శ్రీ లని సంతసింతువె! యిసీ! పరువున్ మరియాద నెంచవా?
చాలు! వయస్సుమీరఁగనె సంతల నమ్మితె జ్ఞానసంపదన్.

కోయిలపాటి దెచ్చికొనఁగోరవె! యూతని పేరు జెప్పఁగా
నీ యఖిల ప్రపంచమున నింతటి గాయకుఁ డేఁడియంచు ని
న్నో యభివందనాల నిడుచుందురు లోకులు లెక్కలేక, నీ
హేయపు జీవితమ్మునకు నీ నగుబాట్లు ఫలంబు తీతువా!

మొన్న వసంతభూమిపతి ముంగిటఁ బాటకచేరి జేయఁగాఁ
గన్నుఁ బసందువయ్యెఁ గన, గాయకరత్నము! ముద్దుకోకిలా!
మున్నవ మూటఁగట్టితివి, మాదకుకోల్వునఁ బాటకాఁడవై
యున్న ముదానవహం బిఁకను నుంతపు లోటులు వేనికేని నీ
వన్న మదీయరాజ్యమున హాస్యమటంచు వసంతుఁడే యనెన్.

# కడసారి

(రథసారథి చెన్నునితో గౌతముని కడసారిమాటలు)

కొను మివె రాజదుస్తులను, గోపమునూనుచు సుప్రసిద్ధమౌ
ఘనతర శాక్యవంశమున ఘాతకుఁడంచు హసింపకయ్య! నా
మనము పరోపకారమను మంత్రమునే జపియించుచుండె, సి
తనువు సమర్పణంబయెను ధాత్రికిసౌఖ్యముగూర్ప, చెన్నుఁడా!

హాయిగ రాజభోగముల నందుచుఁ గష్టములన్న మాట 'నే
మో!' యన లేను, నేను గనియుంటి జీవుల బాధ, చెన్నుఁడా!
నా యెడఁదన్ విరాగమిఁక నాట్యముసల్పుచునున్నదోయి! యీ
హేయపురాజ్యకాంక్షలకు నిచ్చితినయ్య తిలోదకంబులన్

బ్రతికిన మూఁడునాళ్ళు పలుబాములనందెడు జీవకోటి దు
ర్గతులను గాన కే సకలపాలున నవ్వుచు రాచఠీవితోఁ
గుతుకమునం గదియుండుటకుఁ గోరదు నా మది నమ్ముమయ్య నీ
వితతముగా నశింపకను దేటివిరాగమటంచు; చెన్నుఁడా!

అయ్యో, నిశీథమందు తన యాలిని బిడ్డను వృద్ధుఁడైన యా
యయ్యను వీడినాఁడనుచు నబ్బురపాటున లోకులెల్లరున్
చయ్యన నిందఁజేసి వినఁజాలని రీతిని దూరనిమ్ము, కా
కియ్యదె మోక్షసాధన మిఁక కెందుల కాంక్షణింకంబున్నా సిరుల్.

నను నెడఁబాయలేకయె, యనారతమున్ దిగులంది గుంద్రు నా
జనకుని గుండెబాధయును, శాంతినెఱుంగక దుఃఖవార్ధిలో
మునుఁగు యశోధరాంబగతి, ముద్దుకుమారుని రోదనధ్వనుల్
మనమున నెంచనట్టి యొకమానవరాక్షసి నందువా! సఖా!

ఏటికి చెన్నుఁడా! వగచె దీగతి; నింత నమాయకుండనా?
కాటికిఁ జేరు దేహమునఁ గాంక్షలఁ బెంచుట మూర్ఖ్యమే సుమా!
మాట లవేటి కింక ననుమానము మానుము నేను రాజనై
పుట్టిని జేగఁ గొప్పదా, ప్రవించె విరాగము దేహమెల్లెడన్.

జనకుఁడు దిక్కు లేదనుచుఁ జాలవిచారముతోడనుండు, నీ
ననయము వానిఁ జేరి, దరహాస మెలర్పఁగ, నా వియోగమున్
మనమున నుంచుకోఁ గతి మాటలఁ దెల్పి యశోధరాంబకున్
తనయుని బుజ్జగింపుమని ధైర్యము నీయఁగదోయి చెన్నుఁడా!

జీవనసుప్రభాతమును జేర్చుటకీతి సుఖంబు నందగాఁ
ద్రోవల జూచివచ్చెదను, తూర్యసుబోధము జేతు సప్పుఁడే
జీవుల కట్టి శాంతి నిఁక జేర్చని వేళల మిమ్ముఁజూడ నే
నేవిధి వచ్చువాఁడ? శమియింపవె యంతటివేళవచ్చినన్.

# తుమ్మెద

తూరుపు తెల్లవాఱఁగనె, తుఱ్ఱున బూలను ముద్దిడంగ, నె
న్నాళికిఁ జెప్పకే చనెదు, పాపము నీసతి నిన్నుఁ జూచి వే
మారును నేడ్చుచున్నది—అమాయకురాలిని నొక్కమారు ప్రే
మారఁగ కౌగిలించుము, సుఖమ్ములు టక్కరులోయి తుమ్మెదా!

రంగులఁ దాల్చి, యందమున రాజిలుచుండు వచించుఁ బూలతో
సంగమ మేమిగొప్ప! మనసార వరించి భజించు భార్యనే
క్రుంగఁగఁ జేయుకయ్యొ, యనుకూలుఁడవై సుఖయింపుమిక, నీ
యంగన కంటినీరు యమయాతనఁ గూర్చును నమ్ము తుమ్మెదా!

చాలు! వచింప సిగ్గు! నిముసానికి వేలసుమాలసానులన్
లీలఁగఁ గౌగిలించుటలు లెక్కకు మిక్కిలిగాఁగ నుండు, ని
న్నేల వరించిరో తెలియదింతటిరూపసి యొందులేదు! ప్రే
మాలయధర్మకర్త నని హర్షమునందకుమోయి తుమ్మెదా!

'ఎంత రిఝాలమారి మగఁడే' యని లోకులు గాకులట్లుగా
వింతలఁ బెంచి చెప్పఁగని భీతిలియున్నది! యెన్నఁడేని నా
వంశయు నిన్నదిర్చినటు లబ్బురమా! వినలేదు తుమ్మెదా
యింతటి సద్గుణాల గని నేడ్వఁగ. జేయుట నీతిగాదురా!

భ్రమరము బాపనయ్యవలె బర్యటనంబొనరించు యోగ్యుఁడే
సుమ! యని యెల్లరాడఁగనె, సుంతయు జంకక మామగారు నీ
విమలచరిత్రయౌ సుతను బెండిలిఁ జేసిరి—దాని కర్థమా!
నిముసము ప్రేయసీ! యనవు, నెయ్యము నింపవు, మాటలాడవే!

నీ సతి యోగ్యురాలు! నవనీతి నెఱుంగల మాతృశిక్ష—యే
దోసమె లేనిదాని తలద్రుంచి విసర్జనఁ జేసినావు—నీ
మోసపుఁబోకిళిల్ నిజము! ముష్కాలకంతకు మూలమార్గముల్
దోసిలియొగ్గు భార్యకును ముచ్చపుఁబూలకు సామ్యమేది రా!

భానుని ముద్దుభార్యయగు పద్మినితో నలరా విలాసముల్
యీ నళినమంత్రిపుంబనుఁ గెంతటిముప్పులు గూడు! గాని, నీ
మానిని పద్మశాలగని మంగళసూత్ర మహాస్త్రమొక్కటే
కానల నున్న యప్పటికిఁ గామము నున్నది రామరక్షగా!

పూలకు లోటు లేదు—పరిపూర్ణ సుఖంబులు సాంగసాధ్యములం
దాలకు నాలయంబులు, వితాను నెఱుంగవు, పారివృక్షముల్
వేల గడించువార లవి నేకివి! నీకటు పాఁగవమ్మె—నీ
యాలికిఁ బొట్టబూమునటు లన్నము బెట్టఁగలేవు తుమ్మెదా!

రాత్రిరివేళ నింత యనురాగము నింపిన బాలకాంత లే
మాత్రిబిగించి, మచ్చువకు మోమును జూపనినాడు, తుమ్మెదా
నాత్రినిఁ జేర దప్పదయె—నమ్మకు మిట్టివి పూలప్రేమికుల్
గోత్రినిఁ గూల్చు గాపురము గొంపకుఁ జేర్చును ముగ్ధమాటలన్.

# త్యాగరాజు

పుట్టినాఁడవు మాదు పూర్వపుణ్యావశాన
తెలుగుబిడ్డవనెడి కులుకు సిడఁగ
తెచ్చినాఁడవు కీవి దీనురాలైనట్టి
ఆంధ్రమాతకు దరహాస మొసఁగ
పాడినాఁడవు నీవు బ్రతికినన్నాళ్లును
భవ్యమౌ శ్రీరామ ప్రభునిగాథ
కొట్టినాఁడవు ఢంకి గొప్పవిజ్ఞానివై
అఱవలు నీకు జోహారు లిడఁగ

సరస సంగీత సాహిత్య చక్రవర్తి
ఆంధ్రజనయిత్రి ముద్దాడు ననుఁగుబిడ్డ
భక్తశేఖర నీకిదే వందనంబు
ఆర్యసన్నుత తేజ! శ్రీ త్యాగరాజ!

తెలుఁగు విశాలదేశమునఁ దీయనిపాటలఁ శోభతోఁడ, నా
యలఘుల సత్కవీశ్వరుల యాసుకవిత్వ సుధాస్రవంతితో
నలరును త్యాగరాజునకు నర్చన లెప్పుడు నాంధ్రులెల్ల మా
తొలిభవపుణ్య మీతఁ డని దోసిలియొగ్గుదు రెల్లకాలమున్

తెలుఁగుకుమారులందఱకుఁ దేజముగూర్చిన దొడ్డసామి యీ
యలఘుఁడు త్యాగరాజనుచు హర్షముఁ జెందినదాంధ్రమాత! ఆ
కులుకైన మన్ను మిన్నులనుగూడ గణింపదు, తాను దాసియై
కలఁగెని సంగతిన్ గసను కన్నకుమారుని ముద్దులాటతో.

# టక్కరి

ఓ యవివేకిసాలమ! మహోన్నతి నందితినంచుఁ గన్నులన్
మూయకు, మొన్ననే గనఁగ మోడువిధాన విలాపమందితే
హేయము నీదు దుస్థితిని నేమరితిన్ మధుమాసవేళలన్
కోయిల టక్కులాడి దనుకోఁగదె! వాదన లేల సాలమా!

మధురమృదుస్వనంబులను మంజులగీతికలెన్నొ పాడుచున్
పథికుల నెమ్మనమ్ములకుఁ బాయని సమ్మదమీయు కోయిలన్
ప్రథితయటంచు నెంచెదవు స్వార్థపరత్వము దానిదేసుమా!
వ్యథల మునుంగునాఁడు కనువాఁడొకఁడైనను లేదు సాలమా!

మొండగుఁ బండుటాకులను మెల్లఁగఁ బుట్టిడి లేజిగుళ్ళకై
దండను జేరి గానమును దాంభికమంత్రముజేయు గాని, నీ
యండ గలాటి శోభిల సమందితరీతి వచించునొక్కా! ఆ
తింపి వసంతకాలమున ద్రేపులరాఁగ లభించుదన్ననే
కొంపలుమారు మ్రోగునటు కోయని కోయలగూయునెప్పుడున్

కాలముచెల్లి ఆకులును గాంతివిహీనతనంది రాలగా
నేలకొ చెంత జేర గది యేటి ప్రవర్తన, కోకిలాంగనన్
చాల సుశీలయంచు మది సమ్ముదమందితి వాయసాలనూ
చేలవు! నమ్మొనందరిని ప్రేమసవాన్వితులంచు నెమ్మదిన్.

చూచిన చిన్నపిట్ట! కడు చోద్యపువర్తన మేక నేర్చెనో
చూచెదగాక! యంచనెదు చూపులకందని మాయకోయలన్
చూచుట కల్ల, ధర్మమిాల శూన్యమటన్నది నీ వెఱుంగవా
శోచన మేల? వయ్యారొ! వసుంధర మాయలనూటసాలమా!

# ఆంధ్రి

రత్నరాసులవంటి వీరాళిఁ బెంచి
మురిసి ముద్దాడినట్టి సంపూర్తచరిత!
వెంత విఖ్యాతివగలిన నేమిఫలము
దీనతను బొందినావమ్మ తెలుఁగుతల్లి!

గతచరిత్రల దలపోసి వెతనుగాంచి
నిలువు నీరయిపోవుట నీకుఁ దగదు
తాల్మి గనవమ్మ ధైర్యానఁ దనరవమ్మ
ఆంధ్రవీరుల నిర్జీవు లనకుమమ్మ!

తొంటి సౌభాగ్యమునుగాంచి, కంటినీరు
కాల్వలై పార దీనతన్ గలతగనుట
వీరమాతకు దగునఁటే వెఱ్ఱితల్లి
శూరరక్తంబు లపుఁడె చల్లారలేదు!

పందలనుగూడ వీరులై వరలుకీర్తి
కైతలను దాటి, విజయసంగ్రామములకుఁ
బంపఁజాలెడి కవులు నీ బసిడిగడ్డ
బెలుగుచున్నారు, వారి దీవించవమ్మ!

కష్టసుఖములు నీ కలికాలమందు
వెలుఁగు నీడలవంటివో తెలుఁగుతల్లి!
కూలిపోయిన గోడలే కోటలగును
తెలుఁగు దేశము వీరుల నిలయ మమ్మ!

# సంవేధము

భగ్నమైపోయినట్టి దీ బ్రతుకుబాట
మరల రహదారి యగుటకుఁ దెఱవుగలదు!
అదియె ఆశావిహారణ మ్మనెడిదారి
అపుఁడె నూత్నవిలాసమ్మునందు మనికి

జీవితాకాశమంతయుఁ జీఁకటులకు
నిలయమౌనాఁడు మొలఁగెడి వెలుఁగుజిలుఁగు
నవ్యజీవనజ్యోతిశ్శో నర్తనంబు
సలుప దోహద మిడజాలు సత్పథంబు!

కోరికలు లేని నట్టి యెడారి బ్రతుకు
కష్టతెంపఱ లను సుడిగాలివలన
దప్పిగను వేళ నొసఁగును దాహశాంతి
సమత నిమిడించుకొన్న—ఆశాసరస్సు.

చీకుచింతలదాడిలో శిథిలమైన
ఈ శరీరమునకు వన్నెనిడెడి శిల్పి
చేతుల నిక మరామత్తు సేయుశక్తి
విశ్రామం దిది లేని జీవితము లేదు.

## నాఁడు

పలనాటిశూరత కలవరింపంగ
కాకతీయులకీర్తి కంపింపఁజేయు
హంపిలో ఢంకాల యలజనుల్ రేఁగ
చూచి యానందించ నోచుకోలేదు!

కొండవీటిని రెడ్డియంశ యుండంగ
వేఁగిరాజులకీర్తి వెలుఁగుచుండంగ
అమరావతీపురం బభినుతిన్ భొంద
చూచి యానందించ నోచుకోలేదు!

పసుపుతో మానినుల్ పౌరుషంబీయ
వీర్యాలు శౌర్యాలు వెలుఁగొందుచుండ
జాతిప్రశస్తియే జ్యోతిగానుండ
చూచి యానందించ నోచుకోలేదు!

కృష్ణరాయలకొల్వు కీర్తినార్జింప
రాజరా జచ్చోట రాజిల్లుచుండ
విజయభేరి మ్రోత వినిపించు వేళ
చూచి యానందించ నోచుకోలేదు.

కవులకు భూపతు ల్మాన్యలీయంగ
ఆంధ్రభారతి ఖ్యాతి నలరారుచుండ
మా నగారా మ్రోత మార్మ్రోగు వేళ
చూచి యానందింప నోచుకోలేదు.

# పిలుపు

డస్సిపోతిమి రోహిణీధాకతోడ
మేఘుఁడా! యింక రావోయి! మింటిమీద
పక్షు లల్లాడుకున్నాయి! పథికులెల్ల
వగచుచున్నారు నేసంగిబాధతోడ!

మనుజులు మండుటెండలఁ గుమారిలిపోయిరి, యిట్టిగాడ్పు నిం
కను భరియింపఁగా వశముగాదని లోకులె యార్తిఁ జెందఁగాఁ
గనుపడ వేమి! వర్షముల గానుకగా నొసఁగేటి మేఘుఁడా
ఘనుఁడవఁటన్న ఖ్యాతి కలకాలము నీకె చలామణీయగున్.

పచ్చనిమొక్క యొక్కటి ప్రపంచమునన్ గనరానిరీతిగా
వెచ్చనిగాడ్పులన్ విసరె వేసఁగి; మేతకు నేగలేకయే
చచ్చినయట్లు గూలుచు విచారమునందెడి పక్షిదంపతుల్
వచ్చెడి మేఘుఁడే మనకు బాంధవుఁడౌనని రోయినీరదా!

హిందువులన్న శాస్త్రయిన హింసకు నోపనివారటంచు మీ
రందరు విన్నదేగద! యిలాతలమందలి యెన్నిజీవులో
వందలు—వేలు! రోహిణికిఁ బ్రాణములన్ బలివెట్టిరయ్యయో!
యిందర సృష్టి జేసిన దిఁ కేమని దెల్పుదు నోయినీరదా!

మెఱుపుకన్యల కౌగిళ్ల మురిసియునాఁడు
నింగిపై నిల్చి నీవల తొంగిచూడ
నెట్టివ్యవసాయదారుండు వెతల మఱచి
చెప్పుచున్నాడు నీకున్న గొప్పతనము.

# ఆంధ్ర కవితాకుమారి

పలనాటివీరుల పసిఁడిపందిళ్లలో
దరహాస మొలుకంగ వరలినావు
కాకతి ప్రభువుల కన్నకుమారివై
సర్వతోవిభవాన సాఁగినావు
వేఁగిరాజులతోడి విశ్వాస మార్గాన
నగుమోము వికసింప నడచినావు
కొండవీటిని రెడ్లయండ సంపాదించి
తులలేనికీర్తితోఁ దులికినావు

గొప్పగా కృష్ణరాయల కొలువునందు
శోభ నందితి, బొందితి సూరివినతి,
ఖ్యాతి గడియించితివి, తెల్గుజాతి కిలను
ఆంధ్రకవితాకుమారి జోహారులస్తు!

[illegible]

నన్నయ్యగఁటమ్ము నతుల గైకొనునాఁడు
ముసిముసినవ్వుతో మురిసినావు
పింగళిసూరన్న విఖ్యాతరచనల
నానందరాశివై యలరినావు
భీమన్నవాక్సిద్ధి భీతిగొల్పెడివేళ
సన్నుతి జతగూడ సాఁగినావు
ఘనుఁడైన త్యాగయ్య గానస్రవంతిలో
తనివితీరనిరీతి మునిఁగినావు

తిక్కనార్యుని కైతలోఁ దీపితనము
ముక్కుతిమ్మనకావ్యాన ముద్దుపలుకు
గాంచి గర్వించునాంధ్రులఁ గన్నతల్లి
ఆంధ్రకవితాకుమారి జోహారులమ్మ!

# గృహలక్ష్మి

తనయా! నీ విప్పుఁ డత్తింట వినుతులంది
ముద్దుభర్తకు మదిలోన ముదమునింపి
తోడివారల కాదర్శ తోయజాక్షి
వనఁగ మనపేరు నిల్పవే యనుఁగుబిడ్డ!

చెఱువునుండైన, దగ్గఱి చెలమనుండి
చిన్నిగిన్నెడు నీళ్లైన చేతులార
తెమ్మటంచును చెప్పలేనట్టి నీవు
యెటుల మెలఁగెదో! యత్తింట నిమిసేవో!

కొత్తకోడల వగుటచే గోర్కెలూర
పనులఁజేయఁగనీ రమ్మ—వారి నమ్మి
మొదల పనిచేయకన్నచో మొండియనుచు
వాడ వాడల వింతల వాగుచుండ్రు!

పట్టభద్రుఁడు నీ భర్త ప్రథితమూర్తి!
కాని, సంపాదనన్ సలుపు ఘనుఁడుకాను
నాకు నది తెమ్ము—యిది తెమ్ము—నావిధమ్ము
నవాఁజగృహలక్ష్మి కెంతేని సాగదమ్మ!

జాతి కాధారమగును స్త్రీజాతి యనుచు
వినయ విజ్ఞానసంపద వెలయుచుండ
ఖ్యాతి నార్జించుకోవమ్మ కన్నతల్లి!
త్యాగమే జీవితంబున భోగమనుచు!

కాంతయన్నంత గయ్యాళిగంప యనెడి
మూఢవాదాల నన్నిటి మూలద్రోసి
విశ్వమానవకళ్యాణ విధము నెఱిఁగి
నడపుకొనవమ్మ సంసారనౌక నింక.

వినుచునున్నావు వార్తల వింతవిధము
నాలుబిడ్డలఁ బోషింప వీలులేక
నాత్మహత్యకు గురియైరి యధమమతులు
గాన, మంగళసూత్రమున్ గాచుకొమ్ము.

# ప్రతీతి

దీపము లేని దా శిథిల దేవళమందు బడాయికోసమా
కాపురముండినావు ! కలకాలము నిన్ను దివాంధమా యనన్
గోపము లేకనుండెదవు, గూటిని నీ కెటు దోఁచునో గదా
యే పనిపాటు లేక నిటు లేటికి వాదుల నూన ఘూకమా !

కాటుక చీకటుల్ దిశల గ్రమ్మెడివేళ సమాధిశయ్యలన్
దోటలుగా గణించి పరితోషమునంది చరించుచుందువా ?
పాటుపడంగ లేవె భయభక్తులతోఁ గుత నెండవేళ, నీ
బోటి యమాయకుల్ జగతి బుట్టుట వేఱొకవింత యేసుమా !

ఇంత వైరాగ్యమూనఁగా హేతువేమి ?
మూగనోమును బూనితా మౌనమూప
నీకుగల వంత జెప్పు—నీ స్నేహితుండ
ప్రజకు నీకును గల్గిన వైర మేది ?

మనుజులు పల్లు పల్లులకు మానమువీడి 'భళాభళీ' యనన్
ఘనత లభించె జిల్లలకు; కమ్మనిమాటలబాటగాని, నీ
మనము నెఱుంగ రా రెవరు; మానవులెల్లరు గుడ్లగూబరా
యనుచు నాసించు దుర్గతికి నాహుతియైన యభాగ్యరాశివా!

చాలు నింకనైన నీవు మజ్ఞానపథము
లోక మేదారి నడచునో, రాక చూచి
నిన్ను నీవేసుమా దిద్దనేర్చుకొమ్ము
లేనిచో నీకు సుఖ మింక లేదు లేదు.

# యుద్ధభూతము

కత్తినిఁ బూని పెద్ద మొనగానివిధాన జయాభిలాషినై
నెత్తుటికాల్వలం బడి సునిశ్చితబుద్ధిని బోవు ధీరునిన్
గుత్తుక ద్రెంచివైచి భువి గూలఁగఁ జేసెన వేమికర్మమో!
జిత్తులమారి దయ్యము! అజేయుల ద్రుంగఁగఁ జీ యుద్ధభూతమా!

స్వాతంత్ర్యధనము జేఁబట్టిన టక్కరి
ఆయుధసామగ్రి కాలయంబు
దయలేని మృత్యువు తాండవింపఁగ సంధ
శవసమూహము నింపు సాధనంబు
వీరుల భక్షింప వెడలు మహాకాళి
సుఖము మాయము జేయు చుప్పనాతి
అష్టకష్టాలకు నాహ్వానమిచ్చు శక్తి
పోటీలకంతకుఁ బుట్టినిల్లు

రుధిరవాహినులఁ బడి యుయ్యాలలూఁగి
మాంసభక్షణ జేయుచు మసలు శక్తి
కోఱచూపుల మిఱిమిట్లు గొల్పునటుల
యుద్ధభూతము విహరించుచున్న దిపుడు!

రవి

అదు గిడ లేకుండ నల్లాను దీనుల
నగ్గిపాలుఁగఁజేయు నాదిశక్తి
పూర్ణగర్భవతులఁ బొట్టలఁ జీల్చిన
కఠినాత్మమైన రాకాసికొఱవి
స్వేచ్ఛను హరియించి తుచ్ఛమౌ బానిస
వృత్తి జూపించు పాపిష్ఠురాలు
జాలిని మాలి యిల్లాలి సూత్రాలను
నట్టేట గల్పిన సంగనాచి

అంతులేనట్టి ఆశతో నాహవమున
దిరుగుచున్నది ప్రజలు భీతిల్లువేళ
కడుపు కక్కుర్తికై యిటు కరుణలేక
ప్రజల మాపిన తన కెంతభాగ్యమబ్బు !

ఈ యట్టహాసాన నెట్టి సత్కవిరాజు
గంటమ్ము చిక్కెనో మంటలందు
ఈ యహంకృతితోడ నెట్టి రాజ్యశ్రీలు
మటుమాయమయ్యెనో మట్టి గలిసి

ఈ తాండవంబున నెట్టి పుణ్యస్త్రీలు
    వైధవ్యమందిరో వగలు మిగుల
ఈ విలాసంబున నెట్టి నగరమ్ములు
    కాటివాడలయెనో ? కఱవు వరల

తల్లిదండ్రులు లేరను పిల్లగోల
దిక్కు మొక్కును గనలేని దీనులిడాశ
నిట్టి యాక్రందనాల నేమియును గనవా !
కొండలున్నవిసుమ్ము నీ గుండెలోన

# కోకిల

కమ్మనికంఠ మెత్తి కడగండ్ల హుటాహుటి దిబ్బజేసి యా
కొమ్మమీద నిల్చి యదిగో మనకోకిల బాడుచున్నదే!
సమ్మదరాశియై మనకు శ్రావ్యముగా వినిపించుచుండె, రా
గమ్ము సుధా స్రవంతియగు, గానము తేనెలసోనలే సుమా!

సంతతమున్ విలాసగతి సాలముపై వసియించి ఠీవిగా
నింతటి గానకౌశలము నేగతి యార్జనజేసితో గదా
పంతము లేక బొట్టుసరి పల్కుననైన వచింపకుండ న
శ్రాంతము నిట్లు బాడుటకు సత్తువ నెక్కడిదమ్మ కోకిలా!

కవి రచియించు గేయముల గానముజేయును బాటకాఁడు, నీ
ప్రవిమలరాగమాలికలపఙ్క్తి మరొక్క విధాన దోచెడిన్
వివరముగా వచింపఁగదె విస్తృతినందిన నీదు బాటలన్
యెవఁడు రచించినాఁడు? సరి యే దిఁక నీకు జగాన గోకిలా!

జగతి వసంతభూపతికి స్వాగతగీతము బాడమన్నదా?
చిగురులు జీర్ణమౌట కిటు జేయఁగ వైద్యమునేర్చినావె! నీ
నగవుముఖాన నెల్లపుడు నర్తనజేయఁగఁ బాడుకొందువా
జగమున గానకౌశలము సర్వము నీదగు సొంతసొమ్ములే!

చల్లనిచెట్టునీడకడ సమ్ముదమందెడి బాటసారికిన్
బల్లటమే యెఱుంగనటు పాటలఁబాడెద వేకధాటిగా
పిల్లలు నీదు పాటలకు ప్రతినిగాంచి కుహూ యనంగ నే
సల్లలితంబు గానకళ సాధనఁజేసిన ధన్యజీవివా ?

కవికుమారుని బంగరుగంటమందు
రాలినట్టివి రతనాలసరాల జేసి
మన వసంతుని మెడయందు మనఁచుగాఁక
నిలిచియున్నావు నునురెమ్మసీమలందు!

బెట్టుసరి సల్పు, పాడంగ రట్టు కొంచు
నదియె గాయకు సలవాటు! అటులగాక
సహజగాయని వీ వొట్ల సాహసించి
పాడమంటిని గోకిలా పాడవమ్మ!

తూట్లుపడినట్టి గుండెకు తోష మిడఁగ
గారడీవిద్య పాటలోఁ గలదుసుమ్ము!
మధురతరగీతముల నెన్నొ మదికి నింపి
తెలుగుకోకిల వను ఖ్యాతి దెచ్చుకొమ్మ!

తనదు ప్రియురాలి వలపులో తనివిదీర
ప్రమద మంకని నిర్భాగ్యువద్ద జేరి
ప్రణయసారస్య మెఱిగించు బాట బాడి
మెన్నికొంపల నిలబెట్టితీ జగాన!

ఆకసవీథివెంట దరహాసముతో శశి బోవువేళ, చీ
కాకుల కెల్ల 'స్వస్తి' ఇడి గానము జేసెదు, ప్రేమలీల నే
డో కలహమ్మునఁ దిన వధూవరుపాలిటి రాయబారివై
యేకము జేయుచుందువఁట! ఈ రసికత్వము నేడ నేర్చితే!

# వీరమాత

పరితాపవహ్నియే భగ్గునఁ జల్లారె
ప్రేమాతిశయనీతి బెద్దదయ్యె
కాఠిన్యచిత్తంబు గంభీరతన్ వీడె
కారుణ్యరస మది మీరిపోయె
శూరత నాతని చోద్యంబుగా వీడె
జాలియే వానితో మేలమాడె
కార్యదీక్షయు వాని ఖడ్గమున్ విదలించె
నభిమాన మాతని నాశ్రయించె

నిండుగుండెను వింతగా నీరుగారె
నేదిచేయఁగనోపక హీనగతిని
ప్రేమమాశాన బద్ధుఁడై వెడలినాఁడు
చంద్రగుప్తుకు తన తల్లిపరస కపుఁడు !

కలన జయంబుగాంచు తన కన్నకుమారుఁ డఁటన్న తీవితో
జెలఁగెనీ వీరమాత! మురి, చిన్నకుమారుని రాక గాంచి లోఁ
గలఁచు వికారవృత్తి తృటికాలములో గ్రహియించి వాని కిం
పలరగ శౌర్యమీయునటు వల్కె శుభోదయ సుప్రబోధమున్

శూరశిరోమణీ! యని వసుంధర నీ జయ మారయుంగ! నా
రార! యిదేటివర్తన? మురాసతిగర్భమునన్ జనియించి, గం
భీరత రంగపాలవుఁగ వేగెదవా యపకీర్తితోడ? వే
మారులు పంద నీ వనఁగ మానము గోల్పడిపోదువా సుతా!

పరులను నాజిలోఁ దునుముదానికిఁ జెల్లును వీరుఁడన్న, కా
పరమున నింద జేయునెడ బాంధవులంచు సహింపనైతివే!
అరయఁగ లేవు, ప్రేమ కిట నాశ్రయమిచ్చెదవా! యిదేమిరా!
అరమర మాని శూరతవిహారము సల్పుము యుద్ధభూమిలో!

తలపవె నంద దుష్కృతవిధానము నేమరినావె? నాదు ను
ల్లలమని కాగినట్టి రుధిరంబది వింతగఁ జల్లనయ్యెనా?
విలయము వచ్చుగాక, రణవీరున కిద్ది హితంబె! భారతీ
యుల కపకీర్తిసుమ్ము సదనోన్ముఖవర్తన చంద్రగుప్తుఁడా!

క్షాతి స్వేదన లేనకిమ్ము ననీ నీసందేశ మాలింపవా
చేతుల్మోడ్చెదవా విరోధి కిది నీ సిద్ధాంతమా బేలవా?
ఖ్యాతి న్నిల్పెడి భారతీయుఁడవుగావా? ధైర్యమింతేన! పం
పూరా శాతటభాగ్యశేషయశముల్ బొందంగ లే లెమ్మికన్.

భాగ్యసంధాత్రి నా భరతమాతయటంచు
గాంచితి నెంతగా గర్వసరణి
స్వాతంత్ర్యమందుకే జాతిధర్మంబంచు
కట్టితివా నాడు కంకణంబు
నా దేశవీరులు నతులగొన్నారంచు
బ్రతిభ జూపితివయ్య బాహుబలము
చిటికెలో విజయమ్ము జేకూర్తునే యని
బ్రతినూని తుడిచితి బాష్పధార

కన్నతండ్రీ! యిఁ కేడిరా క్షత్రియులకు
పట్టుపగ్గాలు లేని బాహుబలము
మాయమైపోయెనా? మఱుమాట జెపవె
దిక్కులను జూచెదే జగదేకవీర!

---

(ఇది — వీరమాత మురళ తన కుమారుడు చంద్రగుప్తునకు రణోత్సాహం కల్పించడానికి చేసిన ప్రబోధం)

# నేఁడు

గ్రామదేవతకాళికి గజ్జెకట్టి
పట్టిపేదలనెత్తుటి బొట్టుపెట్టి
ఆర్తనాదము శ్రుతిగాఁగ నాడెదీవు
యుద్ధభూతమ! చాలు నీ యుత్సుకమ్ము!

మలమల మాడిపోయెడి యమాయకలోకపురీతి చూడవా?
కలతలఁ గాన్కగా నిడుటకా వెతకుండను వేయు వయ్యారమా!
తలపవె కష్టకాలమును–తల్లిని బిడ్డను వేరుసేతువా?
కలదొకొ జాలిగుండె! నరిగా జరియింపవె! శాంతినీయవే!

పొగచుట్ట దొరకక వగనందుచున్నాడు
తెనుఁగుకర్షకుండు దీనగతిని
'పాన్ సుపారి'కి వక్కలే చిక్కక
ఔత్తరాహుఁడు నేఁడు తత్తరిల్లె
'సాంబరు ఇడ్లీ'కి చాలమారంబైన
అయ్యరుబాబు హుషారుతగ్గె
తేనీటి కొఱతతో నాసజీవాయుఁడే
అష్టకష్టాలకు నాహుతయ్యె

ప్రజల యలపాట్లలోఁ గల పాడుతనము
బయటబెట్టితి వీనాఁడు బాగుబాగు
మెచ్చవలె నిన్ను—కాని, నా కిచ్చ లేదు
శాంతినీయవు—తుదకు విశ్రాంతినిడవు !

# శ్రావణము

వచ్చెను శ్రావణంబు! మన భామినులెల్లరు నీవిమీరఁగా
హెచ్చగు మోదమందుచును నీప్సితముల్ ఫలియించురీతిగా
నిచ్చకు వచ్చినట్లు జరియింతురు వీధులఁ బేరఁటాండ్రుగా
మచ్చికఁజేసె శ్రావణపు మంగళవారము తెల్గుకాంతలన్,

చంకను జారు పిల్లతును, జాలఁగఁ గూర్చిన వాయనమ్ము, నే
వంకనుచూడ రమ్యముగ భామినులే యెదురౌచునుందు రే
జంకును గొంకులేక, తమసాటి సఖీమణులెల్ల గూడఁగా
నింక విరామమున్ గొనక నేగుచునుందురు వీథి వీథికిన్.

పచ్చని తోరణపంక్తులు
వచ్చెడి స్త్రీజాతికంత స్వాగతమిడఁగా
నెచ్చట విన్నను బాటలు
ముచ్చటగా బోవుచున్న ముగుదలమాటల్ !

మెల్లఁగ నీరసమ్మునకు, మిక్కిలిగాఁ గృశియించు భర్తతో
చల్లని వీక్షణంబుల బ్రశాంతముగా తమ మూర్తి దెల్పుచున్
బిల్లల బుజ్జగించెదరు ప్రేమవిహారు లాయాసిబాపుఁగో
తల్లులు బిడ్డలన్ మఱచు ధర్మము నేర్పెను శ్రావణం గిఁకన్.

ఘనత సాక్షితమనురీతి శనగలెన్నొ
కమ్మగా వేచి, కులుకుల జిమ్మునట్లు
పెట్టునంతనే - సఖులన శ్రీమగలుఁగు
శ్రావణీ! శుభధాత్రిని—చాలు ! చాలు !

మొన్నటి పెండ్లికూతులకు ముగ్గులకుప్పలు సంతసంబుతో
నెన్నఁడు నత్తవారు తమ కిత్తురొ ‘శ్రావణపట్టి’ యంచు గన్
సన్నల సిగ్గుదొంతరలు సాఁగుచునుండ నిరీక్షసేయుఁగా
వన్నెలకానుకల్ ముదపువానలఁ దెచ్చెద వెంతదానవే.

మంగళవారమందున నమాయకారాలు విశేషభక్తితో
రంగని ముద్దుగుమ్మను పరాకను వీడి భజించుచుండు, నే
యంగన చేతిచల్వ తన యక్షతల న్నిడునో యటంచు నే
వంగుచు వాయనంబు లిడు పడ్తులు నాస లుయాలలూపఁగన్.

# ఆంధ్రుఁడు

కృష్ణరాయలవంటి కీర్తిమూర్తుల కెల్ల
గోరుముద్దల బెట్టు సారచరిత
ఖడ్గతిక్కనవంటి ఘనతరశూరుల
తన చనుబాలతోఁ బెనుచు తల్లి
త్యాగరాజయ్యకు రాగమాలికలతో
జోలపాటలఁ బాడు సుగుణవల్లి
భక్తపోతనవంటి పండితకవులను
మురిసి ముద్దాడిన ముద్దరాలు

విశ్వసన్నుత విజ్ఞాన విభవచరిత
అమితసద్గుణసంపూర్ణ యాంధ్రమాత
'బాబు!' యని నిన్ను బిల్చెడి భాగ్యమిచ్చె
గర్వపడవోయి, నీదు భాగ్యంబు జూచి!

ఆంధ్రజాతీయతకు నింత ఖ్యాతిగూర్చు
తలపవేమది—చిత్రమో తెలుఁగుబిడ్డ!
నిలకడకు దూరమగురీతి మెలఁగెదేమి
చావలేదోయి ఆంధ్రవిజ్ఞానజ్యోతి!

జాతీయగీతాల శ్రవణకేళులముగా
జోలపాటలవోలె నాలపించి
వీరాధివీరుల విజయగాథలనెన్నొ
మాధురీగరిమతో మదికి నింపి
శౌర్యరసంబును చనుబాలలోఁ బోసి
ముద్దుగాఁ బెంచుచుఁ బెద్దఁజేసి
చిన్నకత్తిను దెచ్చి చేతి కందీయుచు
వీరుఁడా రక్షించు వినుతి జేసి

ఆంధ్రమాతలు విఖ్యాతి నందినారు
తెలుఁగుసీమయె యోధుల నిలయమయ్యె !
కనకవర్షము కురియు నా కాలమందె
ప్రభవమందిన యాంధ్రుఁడే భాగ్యశాలి !

రాజరాజనరేంద్రు తేజమున్ జ్వలింప
నన్నయ్య కలము గైకొన్ననాఁడు
మనుమసిద్ధినిఁ గాంచి మహనీయరచనల
తిక్కన్న వేడ్క నందీయునాఁడు
సర్వజ్ఞసింహుండు గర్వముతో తన
శ్రీనాథప్రౌఢినిఁ జెప్పునాఁడు
రాయలు మోదాన రా రమ్మటంచును
పెద్దన్నకవివరున్ బిలుచునాఁడు

తెలుఁగు కవితాకుమారికి కులుకులొలికె
ఆంధ్ర యానాఁడు వినెను కల్యాణగీతి
ఎట్టి స్వాతంత్ర్యశకమది మట్టిగలిసె
కాచియున్నదిగద శనిగ్రహము మనల

పంటలకెల్ల తల్లి పలుభాములనందెను, చిత్తశాంతియే
మంటలఁ గూలె నింక నవమానమె యూర్జనమాయె స్వేచ్ఛయే
కంటకమయ్యె మాతృహితకార్యములయ్యయొ మాయమయ్యె నీ
వంటి సుధీకులన్ గనిన భామిని ఆంధ్రమె దాసియయ్యెరా!

కలుములతల్లియౌ తెలుఁగుగడ్డకు దాస్యవిమోచనంబనన్
గలుఁగదు, తెల్గువీరులను గర్భదరిద్రము వీడిపో దిఁకే
యలజలమైన నా తమిళులాంధ్రులసొత్తును పీక్షరైరి! నీ
విల సుఖియించు చాటలకుఁ జేర్కొన వేమది ఆంధ్రసోదరా?

త్యాగభోగాదులకు ఖ్యాతినందికొన్న
తెలుఁగుజాతికి రాష్ట్రమే తేలలేదు!
తమిళవీరుల దాడికి తలల నొగ్గి
బ్రతుకు చున్నాళ్లు—సోదరా! పలుకవోయి!

# సుషమ

పసిశీకరంకగానిర్వాణ ప్రభ వెలుంగ
నవ్యనర్తకి యన్నట్లు నాట్యమాడు
మనసు మల్లించనేర్చిన మాయలాడి
సహజసౌందర్యసాధనచాన యొకత !

వత్సరానికి నొకమారు వచ్చు నామె;
అంకచందాలగనినంచు నాత్మ దలచు
'టింగు రంగా !' యటంచును నింగి నిలుచు
ఎందుకోగాని—యీపిల్ల కింతగొప్ప !

వద్దు వద్దనగానె, నావద్ద జేరు
రావె ! రా వేరు ? యని యన్న రానె రాదు !
సరసమెఱుఁగని దిటువంటి సానితోడ
మాటలాడుట నా తప్పు—మాట లేల !

గగనవీధీవిలాసిని సొగసుదనము
గాంచి మురిపించుదామన్న, గడియ నిలచి
రూపు జూపదు తనగొప్ప లోటువడునె
మింటి నున్నందుకా? యింత మిడిసిపాటు!

మాటలాడదు సింగారి! మచ్చుకైన!
పోని—బలవంతమున బిల్వ, మూతి విఱచి
వెకలు నఖముఖాగ్రాకి పంపించుగొఱకు
ఎవరి యొల్పుకి దీనికి నిచ్చగించు!

తారకముబ్బులగమికి నొయ్యారిసాని
మూతి ముక్కుల విఱచు లే ముగునన్రతము
హాసదరహాసలీలతో నాకసమున
వన్నె నింపుచు సౌందర్య ప్రతిమ యొసఁగ

# ఆంధ్రభారతి

కవులను గాంచి రండనుచుఁ గమ్మనిమాటల నాదరించి, యా
కవనమునందు సొంపు గని కానుకలిచ్చుచు సత్కరింప ము
న్నవిరళభోగభాగ్య మహిమాన్వితవై తులతూగితమ్మ! ఆ
ప్రవిమలభూపతుల్ దొఱకుభాగ్యమె లేదిఁక నాంధ్రభారతీ!

కాకతీయులు నిన్ను గన్నాకుగాఁ జూడ
గారాబుబిడ్డవై గ్రాలినావు
రాజరాజనరేంద్రు రతనాలమేడలో
కలకలస్వనములఁ గులికినావు
ఆ రెడ్డిరాజల యనురాగ మార్జించి
దశదిశలన్ గీర్తి దనరినావు
శ్రీకృష్ణరాయలు చేదోడుగానుండ
నిరుపమానపుఠీవి నింపినావు

మఱువలేమమ్మ నీదగు మహితయశము
తెనుఁగుజాతికి గూర్చితి ఘనత నెంతొ!
తెలుఁగువిజ్ఞానదీపిక వెలుఁగువఱకు
ఆంధ్రభారతి! మురుపుటూయలల నూఁగు!

గౌడడిండిమభట్టు కంచుఢక్కను బట్టి
శ్రీనాథకవిరాజు చించినాఁడు
భీమన్నశాపాన పేదవై గంగరాజు
జోలెనుఁ జేపట్టి సోలినాఁడు
రస హాస్యధోరణిన్ దనియించు రామన్న
రాయలకొలువులో ఱ్రాలినాఁడు
భక్తుఁడా త్యాగయ్య భద్రాద్రిరాముని
పాటల రచియించి పాడినాఁడు

పసిఁడి చిరుగజ్జెమ్రోతలు పరుగులిడఁగ
సరససంగీతసాహిత్యసఖ్య మలర
తెలుఁగుదేశాన విఖ్యాతి యలరువేళ
ఆంధ్రభారతి గడియించె నమితయశము!

శ్రీనాథకవిరాజు సీసపద్యాలలో
తూఁగుటుయ్యెలల నూఁగినావు
బమ్మెరాన్వయు భక్తిపథమునందునఁ బ్రీతి
నాట్యంబు సల్పుచు నడచినావు

ముక్కు తిమ్మనకవి ముద్దుపల్కులతోడ
సవిలాసఫణితియై సాఁగినావు
అలసాని పెద్దన్న యల్లిక జేఁబట్టి
వింతగుటీవితో వెడలినావు

ఆంధ్ర విజ్ఞానవిభవంబె యవనిలోన
గణనకెక్కిన వేళల గరువమలర;
ప్రముఖమందితి సుకవితాపథమునందు
తెనుఁగుగైతలు రత్నాల తునక లనఁగ!

# మాళవ్యాజీ

ముసిముసినగవుల తీవిని
హాసియించే భరతమాత కాపదయనఁగా
పసగల మాళవ్యాజీ
వసుధన్ విడనాడి దివికి పయనంబయ్యెన్.

సేవించినాఁడు, ఆశీర్వాదములనిడు
కన్నతల్లిని నిజకాంతులూర
భాషించినాఁడు ప్రభావంతమగునటు
హైందవధీధితి చిందులాడ
నడిపించినాఁడు ఘనతరముగా, విశ్వ
విద్యాలయంబును పేరు మ్రోయ
యాచించినాఁడు మహారాజగృహముల
భిక్షుక ప్రభువను వినతులెలయ

అతని వాగ్ధాటి గంగాప్రవాహమవుచు
పొగడువేళల గరువంబు పొందలేదు!
త్యాగమయజీవి! భారతయోగి యితఁడు
మరణమందెను మాళవ్యమాన్యుఁ డయ్యొ!

గర్భశోకంబు మఱువని కన్నతల్లి
మదనమోహనమాళవ్య మరణమునకు
వగచుచున్నది— నైరాశ్య ఫణితిగనుచు!
భరత జనయిత్రి యెంత నిర్భాగ్యురాలు!

# గౌతమి

గౌతమునిహింస జగతిని పాతఁబడఁగ
మూఁడుకన్నులదొరసిగనుండి దిగెను !
తెలుఁగుమాగాణిభాగ్యంబుఁ దెలుపుఁగొఱకై
అవతరించెను గౌతమి ! యాంధ్రభూమి !

వయసుమీరిన దీనదిభాష వినిన
తెలుఁగువీరుల శూరత తెలియఁగలదు —
ఆప్రవాహములోనున్న దాంధ్రపటిమ !
పుట్టు బానిసజాతికి—బోధపడునె ?

నాశికనుఁబుట్టి—ఒయ్యారి నడకనడచి
ముద్దులొలికెడి యుపనదుల్తాఁగువేళ
సాగరంబును మనసార సంగమించె !
దీనికథవిన్న తెలియురా ! తెలుఁగుధాటి !

ఆంధ్రభారత రచనకు నడుగులిడిన
నన్నయార్యునిఁ గనులారఁ గన్నదీమె
భీమకవిశాపకథలెన్నొ! విన్నదప్పుఁడె
తెలుఁగుసంపద—యీమె కన్నులను కదలె!

పదియు రెండేండులకు నైన పడుచుదనము
గనుచు మహోగ్రంగున్నత్రి పుష్కరమునాఁడు
సాగరముఁ జేర ప్రయాణంబు సలుపునాఁడు
ఆంధ్రజాతికి పండువ న్యైన నప్పుఁడు!



వేచియుండండి!

త్వరలో రాబోవుచున్నది.



ఈ కవిగారిచే వ్రాయబడిన

అపూర్వమైన ఖండకావ్య సంపుటి

**Published by Kalahasti Thamma Rao & Sons,**
**E. G. 60 Printed at Sri Rajeswari Press,**
**Rajahmundry. E. G. 50 Copies 1000 D/ 4-1-1947**